# మధుసేవ



(సాంఘిక నాటకము)

చింతామణీ చిత్రాభ్యుదయాది గ్రంథకర్త

మహాకవి

## కాళ్లకూరి నారాయణరాయ

ప్రణీతము.

ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు

ప్రొప్రయిటరు, సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ (కృష్ణా)

ముద్రణకూర్పు: 1000 ప్రతులు.

బెజవాడ:

ఆంధ్రవాణీముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1937

 Reprint. [వెల రు 1.

# కోకిల

గ్రంథకర్త:—పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

ఇది యొక అపూర్వవిచిత్ర కల్పనాసమేత మగు చక్కని నాటకము. కోకిల ధవునకై తండ్రిని త్యజించిన త్యాగశీల. భవ్యతరప్రాసాదముల సుందరోద్యానముల సంచరించు సతీతిలకమైనను, భయదక్రూరమృగసంకీర్ణ భీకరారణ్యాంతరంగమున నిజధరచారిత్రాభినయనమున మోహాంధు డగు మోహానుని హృదయాగారమున ప్రేమజ్యోతిని వెలిగించి, దమయంతీ అనసూయాదుల మరపించిన పాతివ్రత్యవిరాజిత. అసూర్యంపశ్యయైనను పురుషుల భోగలాలసతాతృప్త్యకై నిర్మింపబడిన క్రీడాపదార్థములుగాక, సతులు పురుషులకన్న నేమిటను తక్కువ కారని లోకమున చాటుటకో యన రాజ్యపరిపాలనాభారము సహించిన రమణీమణి. ఈనాటకము శృంగారరసమునకు నిలయము శృంగారమున కరుణ, కరుణయందే భీభత్సము, దాన రౌద్రము, దానియందే హాస్యము. అంతయు నొక్క రంగముననందే! పసితనముననే తలిదండ్రుల బాసి, కారాగారమున బద్ధుడై, వేదాంతియైన వసంతకుడు, వేదండయానకు దాసుడై కథానాయకత్వమును సహించును. తరువాత విచారణస్థానమున ప్రణయిని కోకిల, విచారణీయస్థానమున సందితులు ప్రేమస్వరూపియగు జనకుడు, దైవసముడగు ధవుడు. విచారణారంగభూమి యురికంబప్రాంతము. నేరారోపణచేయునది తల్లి. దీన ప్రపంచమున స్థాపింపబడు సతీతరుణీమణులయవ్యాజప్రేమ ఈ యత్యద్భుత సంఘటనాశక్తియు, తన్నిర్వహణానైపుణియు, స్త్రీలను పురుషుల జేసి, పురుషుల కబలవేసమునిచ్చి, యపూర్వప్రణయసంభాషణాకల్పనల మేళవించు శేముషి యీ కవిశేఖరునియందే, యీకవివిరచిత మగు నీ కోకిలనాటకమునందే చూడదగును. వెల రు. 1-0-0 మాత్రమే.

---

వలయువా రిట్లు వ్రాయవలెను:—

కురుకూరి సుబ్బారావు, ప్రొప్రయిటరు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ (కృష్ణాజిల్లా).

# అవతారిక

మనదేశమున కిప్పుడు మద్యపానము మహాత్తరశత్రువై యున్నది! ఈ దుర్వ్యసనమునకు లోనైనవారీదేశమున నిప్పుడు రెండుకోట్లయిన నుండకపోరు! బ్రాంది విస్కీలవారి యెక్కుడు వ్యయమును, కల్లుసారాలవారి తక్కువవ్యయమును గలిపి, తలకు దినమునకు కెనిమిదియణాల వంతునఁ జూచినను రెండు కోట్ల మీఁదను దినమునకుఁ గోటిరూప్యములు దగ్ధ మగుచున్నట్లు తేలుచున్నది. అనఁగా: సంవత్సరమునకు మూఁడువందల యఱువది యైదు కోట్లన్నమాట! అనగా: మనదేశముపై దొరతనమువారికి వచ్చు నాదాయముకంటె రెండురెట్లధిక మన్నమాట! ఈ దుర్వ్యసనము హరించి, ఈసొమ్ము మిగిలినచో మనదేశము మహదైశ్వర్యముతోఁ దులఁదూఁగదా! ఇప్పటి నేరములు ఇప్పటిహత్యలు ఇప్పటి కోర్టులు ఇట్టె రూపుమాయవా! ఇంతకన్న స్వరాజ్య మింక నేమున్నది! కాఁబట్టి, ఈ ప్రబలశత్రువును భస్మీకరించుటకై ప్రయత్నింపవలసిన బాధ్యత ప్రతి భారతీయునియందును గలదు. ఈ రూపముగా నాబాధ్యతను నిర్వర్తించుకొను తలంపుతో నే నీ రూపకమును వ్రాసినాఁడను. ఫలితము భగవదధీనము!

పాత్రౌచిత్యము కొరకును, పామరజన సుబోధముకొఱకును గావించిన భాషాసాంకర్యములనేమి ప్రమాదములనేమి పండితులు మన్నింపఁగల రని భావించుచున్నాఁడను. గ్రంథమును గడతేఱఁ జూడకయె, గ్రంథకర్త యుద్దేశమును గూర్చి కాసింతయేని యోజింపకయె, నవరణముల నుపపాదించు సాహసికులను కలములను కాగితములను బాడుసేయువల దని కడుంగడుఁ బ్రార్థించుచున్నాఁడను.

కాకినాడ,<br>1—5—26.

మహాకవి<br>కాళ్లకూరి నారాయణరావు.

A perfect judge will read each work of wit,<br>With the same spirit that its author writ.

# ఇందలి పాత్రములు

1 రఘు- రఘునాథరావుగారు—కథానాయకుఁడు.
2 విశ్వా- విశ్వాసరావు—రఘునాథరావుగారి మేనేజరు.
3 శర్మ- రఘునాథరావుగారి దుష్టస్నేహితుఁడు.
4 నిర్మ- నిర్మల—రఘునాథరావుగారి భార్య.
5 కస్తూ- కస్తూరి—వేశ్య.
6 చిన్న- సిపాయి చిన్నయ్య—రఘునాథరావుగారి నవుకరు.
7 రంగ- రంగఁడు—ఒక త్రాగుబోతు.
8 వెంక- వెంకటేశము—కస్తూరి తమ్ముడు.
9 కాసిం- కాసింసాహేబు—కస్తూరి రహస్య విటుఁడు.
10 ఇన—ఇనస్పెక్టరు.
11 మేజి—మేజిస్ట్రీటు.
12 ప్రాసి—ప్రాసిక్యూటరు.
13 పంతు- పంతులు—రఘునాథరావుగారి వకీలు.
14 నాయు- నాయుడు—కస్తూరీ శర్మల బారిష్టరు.

---

## ప్రకటన



---

శ్రీ మేధాదక్షిణామూర్తిపరబ్రహ్మణే నమః.

# మధుసేవ

## నాంది

గౌరవ మాయువ్వుల్ సిరి సుఖంబును దెల్వియు రూపడంచి, పై వారికి హేయబుద్ధి, తమవారికి వ్యాకులముల్ ఘటించి, నిస్సారులఁ జేయు దుర్వ్యసనసంతతి పాల్పడకుండ మా సభాస్తారుల నీశ్వరుండు సతతంబును సత్కృపఁ గాచుఁ గావుతన్ !

### ప్రస్తావన.

సూత్ర—(ప్రవేశించి) ఓహో! నేఁటిసభ నేత్రపర్వముగా నున్న దే?

సీ॥ తక్కువ తరగతి టిక్కెట్లు కొని, మీఁది
చోటుల కేగి కూర్చుండువారు
క్షణము జాగైనచోఁ జప్పట్లు చఱచుచుఁ
గెవ్వన నూలలు రువ్వువారు
ఇంచుకంత ప్రమాద మెందేని వాటిల్ల
గొబ్బున లేవిడీల్ గొట్టువారు
సమయాసమయముల సంగతి లేకుండ
వన్సుమోరని బిట్టు వదరువారుఁ
గాక కోవిదులును, గుణగ్రహణపరు, లు
దారమానసులును, సావధానమతులు
నైన ప్రముఖులె విచ్చేయు నట్టిభాగ్య
మబ్బినది నేఁ డి దేమి పుణ్యంబొ కాని!

(పరిక్రమించి, చేతులు మోడ్చి) ఓ సభాస్తారులారా!

సీ॥ పసితనమందె పావనవర్తనమునందు
బాగుగ నలవాటు పడినవాఁడు
అప్రయత్నంబుగ నఖిలవిద్యలతోడఁ
గరమును బరిచితిఁ గన్నవాఁడు

బహుకృతి స్వీకార ♦ భాగ్యంబునందు స
　　మానులు తన కెందు ♦ లేనివాఁడు
ఎరి వచ్చిన మంచి♦కే యను తత్త్వ మ
　　త్యంతంబు దృఢపడి ♦ నట్టివాఁడు
పాలుమాలిన యనియెడు ♦ పదము తనకు
కోశముననె లే దనిపించు♦కొన్నవాఁడు
బుద్ధిరాజాన్వవాయాబ్ధి ♦ పూర్ణచంద్రుఁ
డనుపమానుండు వీరభ♦ద్రాహ్వయుండు.

అస్మన్మహనీయున కంకితముగా మహాకవి కాళ్ళకూరి నారాయణ రాయనిచే రచియింపఁబడిన మధుసేవ యను మహాప్రకరణ మిప్పుడు మీసన్నిధిని బ్రయోగించు భాగ్య మబ్బినందులకుఁ బరమానందము నొందుచుఁ బ్రమాదములను మన్నింపఁ బ్రార్థించుచున్నాఁడను. (తెరవంకఁ జూచి) ప్రియురాలా! ఏమి—తడవు? ఏమంటివి?—"మీయనుజ్ఞయె తడ" వనియా?— అట్లయిన, సభామంటపమునకు సమ్మోహనమంత్రముగా ముందు నీవు కొంచెము పాడుము.

తెరలో—

చ॥ వనజభవాండమెల్ల గెలువం ♦ బయనం బగు పుష్పసాయకుం
　　డనుప వసంతుఁ డాసవయు♦తంబుగ నిల్పిన పానపాత్రలో
　　యన ననవిచ్చినట్టి కుసు♦మావళు లాసవపూరితంబులై
　　కనులకు విందొనర్చు నధి♦కంబుగ నిమ్మధువాసరంబులన్.

సూత్ర—సెబాసు! చక్కఁగాఁ బాడితివి! ఇదిగో నేను వచ్చి, సభ్యులకు నీ సంగీతామృత చుళకము తగ్గకమున్నె రఘునాథరాయ పాత్రను బ్రవేశపెట్టెద. (నిష్క్రమించును.)

ఇది ప్రస్తావన.




## ప్రథమాంకము

—:o:—

**ప్రదేశము:** రఘునాథరావుగారి మేడమీఁది కచేరిచావడి.

**ప్రవేశము:** రఘునాథరావుగారు పడకకుర్చీలోఁ గూర్చుండి పత్రిక చదువుకొనుచు.

రఘు—(చదువు నిలిపి, యొక్కనిట్టూర్పు పుచ్చి) మొత్తముమీఁదఁ

బరిస్థితు లన్నియు బహుభయంకరములుగా నున్నవి!

చ. కలహ మొకవంక! జాతిమతి ♦ కక్ష లొకానొకవంక! హత్యలున్

మరణము లొక్కవంక! దయ ♦ మాలిన ధర్మనిరుద్ధ చర్యలున్

జెఱ లొకవంక! నోటికిని ♦ జేతికిఁ గట్టడ లొక్కవంక! ఇ

ట్లెఱుఁగున దేశ మెల్ల నతి ♦ దీనదశావశ మయ్యె నే మనన్!

చ. తలఁకని స్వేచ్ఛతోఁ, బరువు ♦ తప్పియెఱుంగని పౌరుషంబుతో,

నెలకొను శాంతితో, దిశలు ♦ నిండిన కీర్తితో, సమృద్ధితోఁ

బొలఁగని భోగభాగ్యములతోఁ, దులఁదూఁగిన దేశ మిప్పు డీ

ట్టులు తలక్రిందులై, కుడిచెండు స్మృతిలేని విపత్పరంపరల్!

(కొంత యూరకుండి) మనదేశమున కెన్నఁడైన మరల మంచి

యోగము పట్టునా!—ఎక్కడి యోగము—ఎక్కడి లోకము!

సీ॥ కొంపలు తెగనమ్మి ♦ కోర్టుల, [illegible]ళ్ళఁ, గా

ఫీ హోటళ్ళ, వకీళ్ళఁ ♦ బెంచువారు

పండిన సరకెల్లఁ ♦ బరదేశముల కంపి

కఱవున కెర వేఁడు ♦ పఱుచువారు

మూఁడుప్రొద్దుల ముష్టి ♦ మూన్సిపల్ మెంబరు

పదవిలోఁ గనులు క ♦ న్పడనివారు

ఆస్తి భార్యలపేర ♦ అప్పులు తమపేరఁ
బెచి, ఐ. పీ. లను ♦ బెట్టువారు
బట్టకొఱకుఁ, జుట్టకొఱకు ♦ బ్రాందికొరకు
సిరులు పరదేశములపాలు ♦ సేయువారుఁ
బూర్తిగా నెల్లెడల వట్టి♦పోవుదనుక
దేశమున కీ యరిష్టము ♦ తీఱఁ బోదు !

(ఉలికిపడి) ఏమిచెవుమా యా గోల ! (అని లేచి గవాక్షము గుండ వీధివంకఁ జూచి) ఎవనినో తప్పఁద్రాగిన దౌర్భాగ్యుని దండ భటులు - చచ్చిన గేదెదూడనుబలెఁ జరచర నీడ్చుకొని పోవుచుండ పోమరులు కొందరు చోద్యముకిందఁ జూచుచు వానిని వెంబ డించినారు ! సిగముడి వీడ, సింగారించిన వుట్ట మూడ - ఒడ్డునఁ బడ్డ చేఁపవలె, ఓడ దిగిన నావికునివలె - తేపతేపకుఁ దెయితక్క లాడుచు - అనువు తప్పిన యవయవములతో, అలుకుపాఁత లైన యుడువులతో; పెంట లూడ్చిన తలతో, పెచ్చు లూడిన యొడలితో మద్యపానమువల్ల నీమందభాగ్యుఁ డేమి యానంద మనుభవించు చున్నాఁడో !

చ॥ జలములు గ్రోలి కుంజరము ♦ సత్వసమృద్ధి మెలంగ నేర్చు, నా
జలములె త్రావి సింహ మతి♦శౌర్యబలప్రతిభాస్థితి న్మదా
వళ ఘన కుంభయుగ్మమును బ్రద్దలు సేయును; వీని నాత్మలోఁ
దలఁపక, మానవుండు సురఁ ♦ ద్రావఁగఁ గోరు నిదేమి వెఱ్ఱియో!

చిన్నయ్య—(ప్రవేశించి) బాబూ ! రంగ డీపూట కొంచెం రమ్ముసీళ్లు బద్దకించి, పెళ్ళాన్ని కొట్టబోతే-ఆదెబ్బ, అడ్డఁ వెళ్ళిన అత్తగారికి తగిలిం దంటఁండి - అందుకోసం పోలీసువా రాయెదవను ఉరను కీడ్చుకుపోతున్నా రంటండి-యేల్నివారితో యీసంగతి చెప్పమని ఆడిపెళ్లాఁ వొచ్చి అగోరిస్తోందండి.

రఘు—ఏమీ - యిప్పుడు పోలీసువారిచే నీడ్చుకొనిపోఁబడుచున్న వాఁడు రంగఁడా ! ఇటువంటి విషయములలో మానవుకర్లకు మేము సాయపడువారము కా మని చెప్పుము !

చిన్న—చిత్తం బాబూ ! చిత్తం. ఇదే మా పటాలంలో అయితే

యీపాటికి చీకటికొట్లో యేశా రన్నమాటే. తెల్లోడు తాను తాగడఁవే కాని- యెదటివాడు తాగడాని కొన్నడూ వొప్పుకోడు.

రఘు—సరే - నీసోదె చాలుఁ గాని - వీలుగా నున్నయెడల నొకసారి పయికి రమ్మన్నా నని విశ్వాసరావుగారితోఁ జెప్పి- క్రొత్తగుఱ్ఱమునకు జీనుకట్టి కొనితెమ్మని గుఱ్ఱపువానికి వర్తమాన మంపుము.

చిన్న—చిత్తం బాబూ ! చిత్తం. (అని నిష్క్రమించును.)

విశ్వా—(ప్రవేశించును.)

రఘు—మామగారూ ! రంగని సంగతి విన్నారా ?

విశ్వా—విన్నాను బాబూ!- విన్నాను.

రఘు—తోడనే వీనిని కొలువునుండి తొలఁగించుట మంచిది కాదా ?

విశ్వా—మంచిదే కాని- యొకసారి మందలించి చూతము.

రఘు—ఏమి వెఱ్ఱి ! గుగ్గిళ్ళు పెట్టిన గూనివంపు తీఱునా ?

ఆ. దూదిబుంగ నరుఁడు, ♦ దుర్వ్యసనంబులు,
నివురు లేని చింత, ♦ నిప్పు రవలు;
స్పర్శమునకు దారి ♦ సంఘటిల్లిన సంతు
చూడకుండ వీడ♦నాడు లేడ !

ఆపయిని—

గీ. అంటురోగంబులకును, దు♦ర్వ్యసనములకు
లేదు పరికింప భేదము ♦ లేశమేని ;
దరికి రానిత్తు మేని— త♦థ్యముగ ప్లేగు
పోలిక, క్షణంబులోఁ జుట్టు♦ముట్టి తీఱు !

విశ్వా—నిజమే నిజమే. కావుననే; దుర్వ్యసనములకును మనకును దూర మెంతయున్న నంత మంచి దని పెద్దలు చెప్పుదురు. తమ సెలవుప్రకార మీరంగని తక్షణమే తొలఁగించెదను.

రఘు—(నవ్వుచు) సరి కాని, మామగారు ! సాహసించి యడుగుచున్నాను. మీ కేమియు దుర్వ్యసనములు లేవు కద ?

విశ్వా—ఈశ్వరానుగ్రహమువల్ల నింతవఱకు లేవు !

రఘు—ఆఁ! మామగా రిప్పుడు నా చేతిలో మత్స్యము గాలమునఁ జిక్కినట్లు చిక్కినారు! మీకు నస్యవ్యసనము లేదా?

సీ॥ నస్యంబు దృష్టిని ♦ నాశంబు గావించు
పొగచుట్ట పెదవుల ♦ పొలుపుఁ జెఱచు
బీడీలు జిహ్వ క♦పిస్రియ మాచరించును
సిగరెట్టు గుండెను ♦ శిథిలపఱుచు
మద్దతు బుద్ధికి ♦ మాంద్యంబు కలిగించు
గంజాయి పిచ్చిని ♦ గలుగఁ జేయు
కాఫీ నరంబుల ♦ కాపత్తుఁ గలిగించు
టీ పైత్యవృద్ధి ఘ♦టిల్లఁ జేయు
మాదుము వివేక మెల్లను ♦ మంటఁ గలుపు
భంగు జ్ఞాపకశక్తిని ♦ భంగపఱచు
అభిని రక్త మాంసంబుల ♦ నార్చివేయుఁ
గాంచ, దుర్వ్యసనంబులు ♦ కావె యివ్వి?

విశ్వా—నస్య మంతకూడని దని నా కెన్నఁడుఁ దోఁచ లేదు.

రఘు—ఆలాగుననా! అట్లయిన నాలకింపుడు—

సీ॥ ఎంతటివానిచే ♦ నేమియు బిడియంబు
వెడలించి, చేయి చా♦పించితీఱు!

విశ్వా—ఆమాట నిజమే. వెలమదొరగారు కూడ పొడుము ముష్టికి వెనుకతీయరు!

రఘు—తలుచుగా నేడనో ♦ దాఁకొని, వెఱ్ఱి యె
త్తించి, తైతక్క లాం♦డించితీఱు!

విశ్వా—ఏడనో కాదు—ఎదుట నుండియే కంటి కగపడదు!

రఘు—ముందుగాఁ దన్నెత్తి ♦ మూర్కొనకున్నఁ, జే
యఁగఁబూను పని కష్టు ♦ తగిలితీఱు!

విశ్వా—సందియ మేమి— భోజనసమయమునఁ గూడ పొడుము పీల్చినఁగాని కథ నడువనివారు కావలసినంతమంది!

రఘు—ముక్కును ముఱుగు తూ◆ముగఁ జేసి, దేవుని
తిన్నెపైనైన చీ◆దించితీఱు !

విశ్వా—దేవుని తిన్నెమీఁదనే కాదు—దేవునితలపై గూడ నాయూ
టతో నప్పుడప్పు డభిషేకము జరుగుచునే యుండును !

రఘు—ఊటమరకలతో మేని ◆ యుడుపులెల్ల
నించి, చాకలిచేత ది◆ట్టించితీఱు !

విశ్వా—చాకలిచేతనే గాదు-వాకిలియూడ్చు దాసీదానిచేఁ గూడ
చావుతిట్లు తినవలసినదే !

రఘు—పలువలుకు లేల-వెలయాలు◆పగిది- నెత్తి
నెక్కు, కల్ల కుండలు చేతి ◆ కిచ్చితీఱు !

విశ్వా—నిజమే బాబూ !—నిజమే ! ఇదుగో -నా పొడుముబుఱ్ఱ
నిప్పుడె పప్పుక్రింద బ్రద్దలుకొట్టెద ! (అని యట్లు చేయును).

రఘు—సెబాసు ! నాజన్మ మిప్పుడు చరితార్థమైనది ! ఏమూ ?

ఏటవాలుగఁ బాఱెడి ◆ యేటి నుండి;
వ్రణమువలె సల్పు తలమించు ◆ ఋణమునుండి;
నాటుకొనినట్టి దుర్వ్యస◆నములనుండి;
యొకనిఁ గాపాడినను జన్మ ◆ మొప్పు నందురు.

చిన్న—(ప్రవేశించి) బాబూ ! గుఱ్ఱఁ వొచ్చిం దండీ.

రఘు—మామగారు ! నే నొకసారి మనతోఁటవఱకుఁ బోయి వచ్చెద.
ఈపూట వచ్చిన యుత్తరము లివిగో యిచ్చట నున్నవి (అని
బల్లమీఁది యుత్తరములు చూపి, బట్టలు వేసికొని, చిన్నయ్యతో
నిష్క్రమించును).

విశ్వా—(ఉత్తరములం దీసికొనుచు) అవురా ! అబ్బాయిగారి యో
గ్యత ! ప్రభువు లందఱు నిట్టి వారైనచోఁ బ్రజలభాగ్య
మెట్లుండెడిదో గదా !

సీ. కోళ్లతో, గొఱ్ఱ పొ◆ట్టేళ్లతో, సీమ కుం
దేళ్లతోఁ గొలువులు ◆ తీఱువారు !

వేలును లక్షలు ♦ వెచ్చించి, కుక్కలం
గొని మూతి నాకించు♦కొనెడివారు!
ఇంటిదాసీలకు ♦ బంటులై, భార్యల
మోము లన్న మొగాలు ♦ మూడుచువారు!
పాడువేసాలకై, ♦ బ్రాంది సీసాలకై
యెస్టేట్లనే విక్ర♦యించువారు!
నై, జమీందారు లెందఱో ♦ నైజకీర్తి
గంగలోఁ గల్పుచున్న యి♦క్కాలమందు—
భాగ్యవశమునఁ గాక, యి♦ప్పగిది పరమ
పావనుండైన ప్రభువు సం♦ప్రాప్తమగునె!

చిన్న—(వడిగాఁ బ్రవేశించి) అయ్యా! అయ్యా!- రండి!- రండి!- పాడుగుఱ్ఱం బెదిరి బాబుగార్ని పడదోసిం దంట!

విశ్వా—(ఉలికిపడి) అరెరే! యెంతపని జరిగినది! అబ్బాయిగారి కేమియు దెబ్బ తగుల లేదు గద?

చిన్న—అమ్మయ్యో! అంతగుఱ్ఱంమీాదనుంచి పడితే దెబ్బే తగల్దా- తల పగిలిం దంట- తరువేసి ఆసుపత్రికి తీసుకపోతున్నా రంట! పోలీసువారు జామీాను తీసుక పొమ్మంటే- ఆసఁవయానికి రంగ డెల్లాగో ఆదారిగొస్తున్నా డంట- పాపం, బాబుగార్ని వాడే వట్టి లేవనెత్తా డంట!

విశ్వా— (ఆందోళనముతో) అన్నన్నా! యెంతప్రమాద మెంత ప్రమాదము! దైవమా! నీ వింత దారుణమున కొడిగట్టితివేమి!

ఆ. సకల సుగుణ రాశి, ♦ శాంత పయోరాశి,
వినయ భరితుఁ, డతి వి♦వేక కలితుఁ;
డట్టివాని కిట్టి ♦ యాపద కలిగింప
బుద్ధి యెట్లు నీకుఁ ♦ బుట్టె నయ్య!

(అనుచు సత్వరముగా నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.






## ద్వితీయాంకము.

### మొదటిరంగము.

ప్రదేశము: రాజవీధి.

రంగఁడు—(గొడుగు చేతఁ బట్టుకొని ప్రవేశించి)

పాట

(1) సారా కల్లూ సల్లగ వుంటే - రొక్కండబ్బులు రొంటిని ంటే
లోకుల్తో నా కేంవి పని! -యీలోకంతో నా కేంవి పని !

(2) కాలవ లన్నీ కల్లే అయితే - సంవుద్రం వంతా సారా అయితే
కలు వొస్తే నా కేంవి బయం! -కాటకం వొస్తే యేంవి బయం!

(3) సారా సీసా సంక నుండగా - సేతను గుప్పెడు సీకు లుండగా
హాయిగ పేణం పోవాలి - అప్పుడు సొర్గం రావాలి !

సందేయం వేంవీ?-సారా తాగినోడే సరసుడు; కల్లు తాగినోడే ఘనుడు. కాదన్నవాడు నాకాలి గోరుమీదనుంచి బలాదూరు! అయితే, వోటిమాత్రం నిజం: తాగేవాళ్ల అదురుష్టం వంతా తాటిసారాతోటే పోయింది. అందులోనూ సిగురుసారా పోవడం-సిరి పోవడంవే! ఆమాంవిడిసిగురు రంగూ—ఆ సకల సంపెంగ వోసనా-ఆ అగ్గినిప్పు నిషా-వో! వో! గ్యాపకం వొస్తే, వొళ్లు గరిపొడుస్తుంది! పాడురమ్ము-ఈ రమ్మొచ్చి-రొమ్ములు తినేస్తోంది! అయిదుబుడ్లు తాగినా, అగ్గివుల్ల మంటలాగ-అంతలో సెల్లు! సాల్టోళ్ళు తాళ్ళకు నెంబర్లెయ్యడం వొచ్చాక-కల్లుకూడా కంగాళీ అయిపోయింది! కల్లు తాగితే

మునుపు-కవిలాసంలో వున్నట్టుండేది! ఇప్పుడు కల్లు తాగితే-కళ్ళు తిరగడం, వొళ్ళు పెరగడం, పళ్ళు విరగడం తప్ప, పై నేమీ లేదు! కల్లు సంవుద్రం యెక్కడుందో కనపర్చిందాకా, బేప నోళ్ళను పట్టుకుని, బేపుల్నాకేలాగు తన్నే బేసుగ్గా వుండేది! (పరికించి) నేను రంగం వెళ్ళి - ముడుపులమ్మ తీర్తానికి మూడేళ్ళు ఈ మూడేళ్ళల్లోనూ వూరంతా ముక్కలూ సెక్కలూ అయింది. బాండిపాపులు పలచబడ్డాయి- సారాకొట్లు సగం వైనాయి-కల్లుదుకాణాలు కనపడకుండానే పోయాయి! కాఫీహోటేళ్ళు మూతరం కావోసినన్ని లేచాయి! కాని కల్లు కావలిస్తే కానీ యెల్లిన ట్టుల్లాలి! ఈ దుకాణాలు దూరంగా తరిం వేసినోన్ని-పడదీసి తన్నినా పాపం లేదు! వోయి రంగ! వోయి రంగా! నా సేతిసిండా డబ్బే వుంటే-కానీ రాంవేళ్ళ రాల్లంకా కల్లుసలివేందర్లు పెట్టించక పొయ్యానా! డబ్బున్నా వోళ్ళ కొక్కళ్ళకీ తల్లో వూకన్న మాట లేదు. (ముందునకుం జూచి) అదుగో సిపాయి సిన్నయ్యతాత! (పరికించి) ఏంసిన్నయ్యతాతా! యెల్లా వున్నావు?

చిన్న—(ప్రవేశించి) ఇదిగో-రంగ ఎప్పుడో రంగాన్నుంచి దిగాడే?

రంగ—మొన్నటి వోడలో వొచ్చాను తాతా!

చిన్న—ఎన్నాళ్ళ కొచ్చావు! ఏంవిటి రంగం విసేసాలు?

రంగ—అబ్బో! రంగం సంగతి సెప్పడానికి నాతరంవా- నాయబ్బ తరంవా! ఎవణ్ణి సూసినా- సేతినిండా డబ్బు- కడుపునిండా సారా! పెతియూదిని బాండిపాపు- సందుసందుకూ సారా కొట్టు! బాండి సారాలు తాగితే బర్మావోడే తాగాలి; అయితే, రమ్ము సారా వొచ్చాక, రంగాన్ని కూడా షోకు తగ్గిం దంట.

చిన్న—మేం వెళ్ళిన్నాటికి రమ్మింకా రాలేదు.

రంగ—ఏంవిటీ!- అయితే నువ్వు రంగం నూశా వన్నమాటే!

చిన్న—వొక్క రంగంవేనా?-రంగం, మోకీసు, టోకీ, సింగపూరు, మాండలే-వొకటేంవిటి- ఆ టాపంతా సుట్టబెట్టాం. అసలు ఆవా

రాజును పట్టుకున్న దెవరు? మేఁవు కాదూ? అప్పుడేగా ఆకాశాన్నుంచి సుక్కలు రాలాయి! మాపటాలఁ వెళ్ళకపోతే మాఁడలీకోట దొరికేదా! ఆరాజు సింవాసనాన్ని ఆరువొందల వజ్జిరాలున్నాయి! కోటల్లో యెటుఁతిరిగినా - కోడిగుడ్డంతేసి రత్నాలు కాళ్ళకు తగలేవి!

రంగ—రత్నాలేనా! రమ్ముసారా యేట్లైనా వుండేదా?

చిన్న—రమ్మింకా రాలేదన్నాగా? ఇష్టఁవొచ్చి నంత యిప్పసారా పట్టసారా దొరికాయి.

రంగ—అయితే నువ్వ్వా సేనాసారాలు సూశా వన్నమాటే!

చిన్న—సూశాను గానీ, పాఁవుమంతరం నేర్చుకున్నాక, పత్తిరిసేవ మొదలెట్టి, కల్లు సారాలు కంట సూట్టం మానేశాను.

రంగ—సరేగానీ బాబుగా రెల్లా వున్నారు?

చిన్న—బాబుగారు బంగారఁలా గున్నారు. అన్నట్టు సెప్పలేదు! బాబుగారు పడ్డప్పుడు నువ్వు సెసిసి సేవకు, బగుమతి యివ్వడానికి పిలమంటే- నువ్వు రంగఁ వెళ్ళినట్టు నేనే సెప్పాను. అప్పట్లో నువ్వుంటే అడిగిన యీనాఁ విచ్చేవారు. నిజంగా బాబుగా రప్పుడు నీమూలాన్ని బతికారు!

రంగ—తప్పు తప్పు! నామూలాన్ని కాదు-సఁవయానికి నా సేతులో వున్న సార సుక్క మూలాన్ని బతికారు! ఆ పడ్డపాఁటుకు ఆ సుక్క పడకపోతే- ఆపాట్న గుటుక్కు మనవలసిందే!

చిన్న—అయితే బాబూ!- అన్యాగా క్కీకాడికి తెచ్చించి నీసేతి బోణీయేనా!

రంగ—అదేం టదేంటి? ఏకాడికి తెచ్చిం దేంట?

చిన్న—ఏకాడికా - (మెల్లగా) తాగినోడంటే తరిఁవేశేకాణ్ణుంచి- తాగుపోతుల్ని సూట్టా కూకుండబెట్టుకుని, తప్పతాగే కాడికి! కాఁవోసినంత సొమ్ముతో కలకల్లాడేకాణ్ణుంచి- అరప య్యేల్దాకా అప్పునేసే కాడికి! ఈపాలి తెలిసిందా?

రంగ—(ఆశ్చర్యముతో) నిజంగానే ?

చిన్న—అమ్మతోడు ! ఆమారాజుమీాద నే నబద్దం వాడతానా !

రంగ—అవు నవును ! అందు కాచ్చేరిం వేవుంది ! నామట్టుకు నా కెల్లాతగులుకుందో తెల్సులా ? మాబాబు దినానికి, మాసాతాని జియ్యన్న సచ్చినోడు కానికాని పుచ్చుకొని, కాస్త కాస్త సేతులో పోశాడు ! ఆకానిడబ్బు నీళ్ళతోనూ, కాంవారవు జీడిలాగుపట్టుకుంది ! అయితే, బాబుగారికి కార్జంవయిందా ?

చిన్న—కాంవేసినంత బలవంతంమీాద నిరుడు కార్జమాత్తరం జరిగింది. ఆమెనక, అమ్మగార్నారు పంపాలేదు, యీారు తీసుకుని రాలేదు. అయితే, రంగాన్నుంచి అప్పుడే వొచ్చావాశా వేం ?

రం—అబ్బో ఆగొడవ సేనావుంది. వో బర్మావోడికీ నాకూ, సారాకొట్టులో జగడం పెరిగి శాకుతో పొడిసాను. అందుచేత పోలీసోళ్ళ కందకుండా అమాంతంగా సక్కారావల శొచ్చింది

చిన్న—అల్లా గయితే నీ సేతికొంద రింకా అణగలే దన్నమాటే ! ఏం తెచ్చావు రంగాన్నుంచి ?

రంగ—రంగాన్ని గడించిం దంతా రమ్ముసీళ్ళకే పోయింది. వో పెట్టీ, వోపట్టు రువాలూ, యీా గొడుగూ, పదిరూపాయలు రొక్కం మాత్తరం తెచ్చాను. పదిరూపాయలూ వచ్చిన్నాడే పయిన లయ్యాయి. మొన్న పెట్టమ్మాను, నిన్న రుంవాలమ్మాను, యీావూల యీాగొడు గట్టుకు బయదెల్లాను.

చిన్న—సరే, సరే, అదుగో సెర్మగా డొస్తున్నాండు ! ఆడికంట పడితే యేదో పని సెప్పకమానడు. ఆన కింటి కొస్తాను పద.

రంగ—సెరమగా డెవడు ?

చిన్న—బాబుగారికి దాపరించిన బాటిల్ మేష్టర్లలో వొకడు ! తక్కిన మాటలు తరువాత సెబుతాలే !

(ఇద్దఱు నిష్క్రమింతురు.)



# రెండవరంగము.

పరిదేశము—రఘునాథరావుగారి మేడమీఁది గది.

పరివేశము—బ్రాందిసీసాలును, గ్లాసులును గల బల్లకుఁ జెరియొకవైపున
కూర్చుండి—రఘునాథరావుగారు, శర్మ.

రఘు—సరి కాని- యొక సందేహము—

చ॥ మనసు తటాలున న్మారవు ♦ మూదిరి దీప్తి వహించు; బుద్ధి య
య్యెన కిరణంబులం గమల ♦ మెట్లులో యట్లు వికాస మొందుఁ; జ
య్యెన నిఖిలాంగకంబులును ♦ యంత్రమునం ఘటియించినట్లు కాౢ
లును-మధుసేవ యేటికిల♦లోన నిషేధ మొనర్చిరో బుధుల్ !

శర్మ—ఈ డౌటు (Doubt) నే నిట్టే క్లియరాఫ్ (Clear off) చేసెద
ను గాని- ఇంకొక గ్లాసు కానిండు.

రఘు—(నవ్వి) దానిడౌటు దానిచేతనే కాని తీఱదు కావలయును !

ఇద్దఱు—(బ్రాందితో గ్లాసులు నింపి, పానము చేయుదురు)

రఘు—దీనితో నీ వెన్నిగ్లాసులు ?

శర్మ—ఎన్నియో యెక్కడ ?- అన్నియుఁ గలిసి మైదేగా ! మీరో ?

రఘు—నేను మూడే కాని- నా కప్పుడే ముచ్చెమటలు పట్టుచున్నవి !
ఏమి చిత్రమో కాని- యెన్నిగ్లాసులు పడినను నీ వేమియుఁ
జలింపనే చలింపవోయి!

శర్మ—అదిగో అదియే మనయొద్ద నున్న యతిశయము.

ఉ॥ త్రాగుట గొప్పకాదు, పది♦ద్రాములు త్రాగిన మూలమూలలన్
దాఁగక, డీలు వోక, వస♦త్రాగిన పిట్టవిధాన వెఱ్ఱిగా
వాఁగక, యొద్దకుం జనిన ♦ వాసన గొట్టఁగ నీక, వీధులన్
దోఁగక; పెంటకుప్పలను ♦ దోరక- యొప్పుటె గొప్ప నా దగున్.

రఘు—సరే కాని- నాసందేహము తీర్చినావు కావు.

శర్మ—బాబూ ! మనపెద్దల తెలివితేటలు మనకుఁ బూర్తిగాఁ దెలి
సిన తరువాతఁ గూఁ మన కీసందేహ మెందులకు ?

చ॥ దినకరుఁ డంబరస్థలిని • దేరిపయిం జను నన్నవారు; అ
వ్వనరుహబాంధవారుల న • వారిగ సర్వము మిగ్రంగు నన్నవా;
రనువుగ నస్తివార్థులకు • హాస్యులు చెప్పినవారు- మద్య మం
టిన దురితం బటంచుఁ బ్రిక•టించుటలో విపరీత మున్నదే!

రఘు—నాన్సెన్సు (Nonsense) నా కామాట నచ్చ లేదు.

ఉ। మానమునందు, శాస్త్రపరి•మాణమునందు, వివేకమందు, వి
జ్ఞానమునందు, నాగరక • సంపదయందుఁ; గళారహస్య సం
ధానమునం దశేష వసు•ధాస్థలికి న్మనదేశమే గురు
స్థాన మటంచుఁ దేలె! సుర•సంగతియే మనవా రెఱుంగరే?

శర్మ—అట్లయిన నొకటి కావలెను: అట్టిభయమే పెట్టకపోయినచో, నందఱు నదే మరగి, మనవంటివారి కందకుండఁ జేయుదు రని యట్లు నిషేధించి యుందురు. అయినను, మనవా రేమన్న నేమి- అనుభవజ్ఞులైన యింగిలీషువా రన్నమాట యిది.

* హీ మస్టు డ్రింకు విస్కీ- ఆఫ్ దీ స్ట్రాంగెస్టు కైండు.
టూ స్టెడీ హీజ్ నర్వ్ అండ్ స్ట్రెంగ్తెన్ హిజ్ మైండు.

రఘు—నరే కాని- ఆదిలో నీ కీ యంటురోగ మెట్లు సంప్రాప్తమైనది.

శర్మ—అబ్బో!- ఆగ్రంథము- అరేబియన్ నైట్సంత యున్నది! మఱియొకగ్లాసు వేసికొని మనవి చేసెదను. (అని యట్లు చేసి) నేను స్కూలులోఁ జదువుకొనుచుండఁగా- మా టీచరుగా రొక సారి మాచేత నొక నాటక మాడించినారు అంతట, నాదృష్టి చదువుమీఁదినుండి, సరాసరి నాటకములమీఁదికి నడిచినది. ఆపాటున, మాయూరునందలి- ఆంధ్ర యువజన సంతోష సంగీత సరస్వతీ హిందూనాటక సమాజ సంఘ సభలోఁ జేరినాను. నాటక సంఘముయొక్క నామమునకుఁ గాఁబోలు నవ్వుచున్నారు! ఇప్పటి పేరు లింకను గమడగొయ్య, గత్తర బిత్తర, కొకి బికి కొల్లేటి చేఁదాఁడులుగా!

* He must drink Whisky of the strongest kind,
To steady his nerve and strengthen his mind.

రఘు—కాదన్నవా రెవరు?- నీకథ కానిమ్ము. అందుఁ జేరినావు.

శర్మ—చేరఁగానే- సంఘమువారు నా నరబా చూచి, నూనూగు మీసము నున్నఁగా గొరిగించి, చిన్న చిన్న స్త్రీవేషములు వేయించుటకు మొదలుపెట్టినారు. కాని, యేమి లాభము ?- గంపెడు సిగ్గు ! పెండ్లికూతురివలె రంగస్థలమున కరిగి- పేడకుప్పవలెఁ జతికిలఁబడెడివాఁడను ! సభ్యులవంకఁ గన్నెత్తి చూచితినా-చలిజ్వరము వచ్చినంత వడంకు ! మా మేనేజరు మంచి బాటిల్ మాష్టరు ! ఆదినములలో నే నాయన దినచర్యనుగూర్చి యల్లిన పద్యము చదువనా ?—

సీ॥ మార్నింగు (Morning) కాఁగానే । మంచము లీవింగు (Leaving)
మొగము వాషింగు (Washing)చ । క్కఁగసిటింగు (Sitting)
కార్కు(Cork)రిమూవింగు(Removing) । గ్లాసుఫిల్లింగు(Filling)
గడగడ డ్రింకింగు (Drinking) । గ్రంబులింగు (Grumbling)
భార్యతో ఫైటింగు(Fighting)। బయటికిమార్చింగు(Marching)
క్లబ్బును రీచింగు (Reaching)। గాంబులింగు (Gambling)
విత్తము లూసింగు (Losing) । చిత్తము రేవింగు (Raving)
వెంటనే డ్రింకింగు (Drinking) । వేవరింగు (Wavering)
మరల మరల రిపీటింగు (Repeating) । మట్టరింగు (Muttering)
బసకు స్టార్టింగు(Starting) జేబులు । ప్లండరింగు (Plundering)
దారిపొడుగున డాన్సింగు (Dancing) । థండరింగు(Thundering)
సారెసారెకు రోలింగు (Rolling) । స్లంబరింగు ! (Slumbering)

రఘు—(పకపక నవ్వి) ఓరీ నీపద్యము కాల! ప్రాణములు తీసినావు!

శర్మ—ప్రతిరోగమునకు బ్రాందిచుక్క పరమౌషధ మని యాయన సిద్ధాంతము. ఆసిద్ధాంతము ననుసరించి యొకనాఁ డాయన నారోగమున కొకయవున్సు బ్రాంది త్రాగించెను. ఆవూఁట నాయాట- నిప్పు తొక్కిన కోఁతివి నీవా నేనా యనునట్లు నడచినది ! అందువల్ల, నాఁడు మొదలు నాకది మంటైనది. ఆయన చుక్క

హెచ్చినకొలఁది నా చులుకుతనము హెచ్చినది. నాచులుకుత
నము హెచ్చినకొలఁది యాయన చుక్కయు హెచ్చినది. ఆనాఁ
డావిధముగా నాయన పెట్టిన బిచ్చ మవిచ్ఛిన్నముగా నేఁటికిని
సాగుచున్నది! నాకథ యిది దయచేసి, మీకథ కూడఁ దెలి
పితిరా విని యానందించెదను. మీరుపక్రమించులోపల నొకసారి
మరల నోరు తడుపుకొనెద. (అని మరలనొకగ్లాసు త్రాగును.)

రఘు—నాకథ నాకె వి తగాఁ దోచునంత విచిత్రమైనది! మొన్న
మొన్నటివఱకును, మద్యపానమును నాకంటె నిరసించువారు మన
యిండియాలో లేరు! అట్టి స్థితిలో, నొకనాఁడు నేనొక క్రొత్త
గుఱ్ఱము నెక్కి షికారుపోవుటయు- నొకచోట నదిబెదరి బొగ్గోలు
పడుటయు. నేను దత్తరిల్లి తలక్రిందగుటయు- తలపగులు
టయుఁ- దటస్థించినది. అప్పుఁడనే, త్రాగినందులకై నాచే
గొలువునుండి తొలఁగింపఁబడి-దైవయోగమున, నానమయమున
కాచేరువకు వచ్చియున్న నా పరిచారకుఁ డొకఁడు నా పాటు
చూచి, చప్పునఁ దనకడనున్న సారాయి యింత నోటఁబోసెను!
అ మ్మైకతలోఁ జిమ్మనకుండ నాచుక్కలు మ్రింగితిని! అప్పు
డెత్తేఁగిన దంతవఱకే. మఱునాఁడు మధ్యాహ్నమునకు మరలఁ
దెలివి వచ్చినది. కాని; తాళవశముకాని తలపోటు! డాక్టరు
నాబాధ చూచి, గ్లాసుతో నింత యరఖు తెచ్చి పోసెను.
దానిచే మరల మైమఱచి నిద్రించితిని. కాని, మెలకువ రాఁగానే
తలపోటు మరల దాపురమైనది! మరల డాక్టరు మందు తెచ్చి
పోసెను. ఈవిధముగాఁ దెలివి వెంబడినె తలపోటు — తలపోటు
వెంబడినె డాక్టరు గారి పరమౌషధము!

శర్మ—సరే, సంగతి బోధపడినది. ఆ పరమౌషధము బ్రాంది!

రఘు—యూ ఆర్ రైట్! (You are right) కాని, యీసంగతి నా
కప్పటికి దెలియదు. గాయము మానినపిమ్మటఁ గూడ గ్రహచా
రవుఁ దలపోటు మానకపోఁగా-డాక్టరు తానిచ్చుచువచ్చిన యర

ఖది యని తెలిపి - బాధానివృత్తి యగువఱకును బ్రాందిసేవ తప్పదని చెప్పెను ! ఇంకఁ జేయవలసిన దేమున్నది ?-

చ. పదిలముగా గవాటమును ♦ వైచి, యొకండనె కూరుచుండి యీ
గది నొకకొన్నినాళ్ళు- నిటఁ ♦ గా దని మా వనవాటి కేగి పూ
పొదలను గొన్నినాళ్ళు-నిరు ♦ పూఁటల మందుగఁ గ్రోలి క్రోలి, హా!
తుద కిటు రేవు మాపులను ♦ దుష్టిగఁ ద్రాగెడుదాఁక వచ్చితిన్!

శర్మ—ఇంకఁ జెప్పనక్కఱ లేదు. ప్రపంచమునందలి పైతరగతి త్రాగుబోతులలో-వందకుఁదొంబదిమంది వైద్యులవల్ల వక్రించినవారే!

గీ॥ తథ్యము వచింతు- మద్యనుం ♦ దరికి గన్న
తండ్రి వైద్యుడు; వెలయాలు ♦ తల్లి వైష్ణ
వుండు చెలికాఁడు; తద్వర్త ♦ కుండు దూత;
జారులుం, జోరులు, నిశా ♦ చరులు, మంత్ర
వాదులుం, జూదరులు, నటుల్ ♦ వలపు మగలు !

రఘు—అయినను, నే నాయన చెప్పఁగానే మెత్తబడ లేదు. అనేక సాధనములు చేసి చూచినాను. కాని, దానితోఁ గానితలపోటు తగ్గెడిదేకాదు! చివర కొకసంవత్సరమున కాశిరోవేదన పోయినది. అయిన నేమి- అప్పటికి యది వెన్నెముకవఱకును వేరుతన్నినది!

శర్మ—(తనలో) కనుకనే, మావంటివాండ్ర కింత గ్రాసము దొరకుచున్నది ! (పయికి) అయిన, నందులకు మీ రన్యథా భావింప నవసరము లేదు.

* ఏ లిటిల్ విస్కీ, నౌ అండ్ దెన్,
యీజ్ రెలిష్డు బై దీ బెస్టు ఆఫ్ మెన్.

అని కారికలే యున్నవి. అది కాక- మీరు గుఱ్ఱముమీది నుండి పడినప్పుడు మీ సేవకుడు పోసిన చుక్కలే మీప్రాణములను నిలిపినవి కాకున్నఁ దోడనే కాళ్లు జేతులుఁ జల్లబడెడివి. మద్యముయొక్క మహిమకు మేరయున్నదా !

---

*A little whiksy, now and then, Is relished by the best of men.

సీ॥ కనుగందువాఁ డౌక • గ్లాసు వేసినతోనె
హనుమంతునకు గతు • లాట నేర్పు
మూఁగవాఁ డొక్కడౌ • ముం గొన్న మాత్రాన
వేనోళ్ల శేషుని • వెక్కిరించు
పిఱికివాఁ డొక యౌన్సు • పీల్చిన యంతనే
యుత్తరు చెంపపై • నూరు కొట్టు
పుంస్త్వహీనుం డొక • పుడిసెడు గొనఁగానె
సింహబలుం బట్టి • చిత్తుచేయు

పరమలోభి యొక్క • పాత్రెడు సేవింప
దానకర్ణు దరిమి • తరిమి కొట్టు
శోకభరితుఁ డొక్క • సోలెడు గ్రోలిన
నొడలు మఱచి హర్ష • జడధి మునుఁగు!

రఘు——(నవ్వి) ఇదిగో - యీ నీ ధోరణియే యిందులకు నిదర్శనము!

శర్మ——నామాటలు మీ రట్లు నవ్వులఁ బుచ్చఁదగినవి కావు. జగత్ప్రఖ్యాతి వడసిన- షేక్స్పియర్ త్రాగుబోతు, షెరిడెన్ త్రాగుబోతు; విల్సన్ త్రాగుబోతు, నెల్సన్ త్రాగుబోతు; మనలో- వ్యాసుఁడు త్రాగుబోతు, వాల్మీకి త్రాగుబోతు; కాళిదాసు త్రాగుబోతు, కబీరుదాసు త్రాగుబోతు; ముప్పదిమూడుకోట్ల దేవతలు త్రాగుబోతులు, మును లందఱు త్రాగుబోతులు. ఇప్పటి నాగరక ప్రపంచములో త్రాగనివానికి తావే లేదు! త్రాగినవాఁడే యూరికి తలమానికము-త్రాగినవాఁడే నలుగురిలో తగవరి! త్రాగినవానికే యూరిలో దాక్షిణ్యము-త్రాగినవానికే యింటిలో ధర్మపిండము! త్రాగినవానికే సభలో తాంబూలము- త్రాగినవానికే మేజువాణీలో దండము! ప్రభువు త్రాగక పాలింపలేఁడు- సేవకుఁడు త్రాగక సేవింపలేఁడు! వకీలు త్రాగక వాక్కు మెదపలేఁడు-వైద్యుఁడు త్రాగక వ్యాధిని గనిపెట్టలేఁడు కవి త్రాగక కలముపట్టలేఁడు- గాయకుఁడు త్రాగక కంఠ మెత్త

లేదు! పూజారి తాగక పులికాపు పెట్టలేడు- అర్చకుడు తాగక హారతి పట్టలేడు! వంటవాడు తాగక వండలేడు- వడ్డనవాడు తాగక వడ్డింపలేడు! పెండ్లిలో తాగుడు, పేరంటములో తాగుడు; విందులో తాగుడు, వీడుకోలువులో తాగుడు; క్లబ్బులో తాగుడు, గ్రంథకుటిలో తాగుడు; రచ్చలో త్రాగుడు, రైలులో తాగుడు; భోగములో త్రాగుడు, రోగములో తాగుడు; చావులో తాగుడు, శ్రాద్ధములో తాగుడు! ఈవిధముగా తాగుడు: ఇష్టదైవమువలె నిహాపర సాధనమై- పడుగు పేకలవలె ప్రపంచమంతయు నిండి- గాలి వెలుగులవలె గౌరవాదరములను బడసినది, పడయుచున్నది, పడయు నున్నది!

రఘు—(పకపక నవ్వి) ఓరి నీ లెక్చరు కాల! టెంపరెన్సు సొసైటీ వారి (Temperence Society)దుంప తెంపెదున ట్లున్నావే! సరి కాని, యీదుర్వ్యసనమున కిందఱు లోనగుటకుఁ గారణమేమి?

శర్మ—దాని మహిమయే దానికిఁగారణము ఆమహిమ కంతున్నదా!

సీ॥ బ్రాందిసీసా కంటఁ ♦ బడఁగానె వరహాల
పాతు కాన్పించిన ♦ పగిదిఁ దోఁచు!
తప్పొ మంచును గార్కు ♦ చప్పుడైనంతనె
జయభేరి విన్నంత ♦ సంబ్రమొదవు!
దొడదొడ గ్లాసులోఁ ♦ దొలికించు సమయాన
నమృతంబు పడుచున్న ♦ యట్లు లుండు!
చుఱచుఱ గొంతులోఁ ♦ జొచ్చెదు తఱి, పోయి
నట్టిప్రాణము వచ్చి ♦ నట్లు లొప్పు!
అవల, నానందవార్ధి నో ♦ లాడునట్లు
స్వర్గభూమి విహారము ♦ సలుపునట్లు
రంభ మెయిడీలోన నిద్దుర ♦ గ్రమ్మినట్లు
తన్మయావస్థలోనఁ జి♦త్తము సుఖించు!

రఘు—అసహాయవాదులు దాని నంత మొందింపఁ జూచుచున్నారే.

శర్మ—అనహాయవాదులు కారు సరిగదా- హరిహరాదులు కూడ దాని నంత మొందింప లేరు ! ఏ మందురా?- వారి నడ్డుకొనఁ గల మహానుభావులు వైస్రాయి సభలోఁగూడఁ గలరు ! ఆ పైని- ఎలెక్షనులలో దాని కిప్పు డెక్కడలేని ప్రాముఖ్యతయుఁ గలిగినది ! విన్నారో లేదో- మొన్నటి మ్యూనిసిపల్ యెలెక్షను సందర్భమున- సారాకొట్టు, మ్యూనిసిపల్ కచేరీలమధ్య, వోటర్లు- తిరుపతి మొక్కుల బిచ్చగాండ్రవలె తీట తీఱ దొరలినా రఁట! దీని కేమి గాని- క్లబ్బులో గానసభ యఁట- వెళ్ళుదమా?

రఘు—చీట్లాట గుంపులో మనక్లబ్బు- శివగంగ తిరునాళ్ళను మించి యుండును గదా- ఆగందరగోళములో గానసభ కూడనా !

శర్మ—అసలు, మీకు, సంగీతమునందుఁ జవి కలదా ?

రఘు—సంగీతమునందుఁ జవి లేకపోలేదు గాని-

చ॥ బిరడలు త్రిప్పి, తంత్రులను ♦ బెళ్ళున త్రెంచి, ముడు ల్ఘటించి, తం
బుర శ్రుతి చేసి. గొంతుకప♦ముర్ సకిలింపుల నెట్టి, కూబపై
కరము గదించి, వాతపారి ♦ క్రిమ్మిన చందమున న్వికార నై
ఖరి సభలోన గింజుకొను ♦ గాయకుఁ డన్న నసహ్యమే జుమా !

శర్మ—అట్లయిన, మీ కాఁడుపాటపై నాదరము హెచ్చున్నమాట !

రఘు—ఆఁడుపాట యన్న జ్ఞప్తికి వచ్చినది. మొన్నరాత్రి యీవీధి నొక పెండ్లియూరేగింపు వెళ్ళినది. ఆయూరేగింపు నేఁజువాణీలో నొకతె పాడినది గదా-ఆ స్వరమాధుర్య మే మని చెప్పుదును!

శర్మ—స్వరమాధుర్య మేనా- దాని సౌందర్యమాధుర్యము కూడఁ జిత్తగించినారా?

రఘు—అంతవఱకు జరుగుట కవకాశము లేకపోయినది.

శర్మ—(తనలో) సెబాసు ! అవలైన ఆపర్చూనిటీ (Opportunity) దొరికినది ! ఈసందర్భములో సీతనికి మమత కలిగించి, దాని యింటికిఁ దార్పఁగలిగితినా- నాయదృష్టము నాలుగుకాళ్ళమీఁద

గడచిన దన్న మాటే! బహుకాలమునుండి దానిపై నాకుఁగల భ్రమయుఁ దీఱును- ఈయెఱచేత నీతఁడు నాచేతి కీలుబొమ్మయు నగును ! ఏమి ఛాన్సు ! (Chance) ఛూ బర్డ్సు విత్ వన్ స్టోన్ ! (Two birds with one stone)

రఘు—ఏమిటి యాలోచించుచున్నావు ?

శర్మ—ఏమని చెప్పుదును ! దానియందము చూడఁగానే నా డెందము గ్రుంగిపోయినది !

రఘు—అ దేమి ?

శర్మ—అ దే మేమిటి ?- ఆ సౌందర్యరాశిని చూడనివి చూపులా !

రఘు—ఎవతె యా యువతి ?

శర్మ—దానితల్లి దానికి పెట్టిన పేరు: కస్తూరి—దాని సౌందర్యమును బట్టి లోకులు పెట్టిన పేరు సెర్చిలైట్ ! (Search light)

రఘు—ఆ కంఠస్వర మా కస్తూరిదే యని నీ వెట్లు చెప్పఁగలవు ?

శర్మ—ఆ సమయమున నేనుగూడ నా మేజువాణీలోనే యున్నాను. ఉండకపోయినను జెప్పఁగలను. అట్టికంఠస్వరము కల దీయూరిలో నదితప్ప యింకొకతె లేనే లేదు.

రఘు—(నవ్వుచు) అట్లయిన, నీ వీ యూరిలోని ఆటకత్తెల నందఱ నెఱుఁగుదు వన్నమాటయే !

శర్మ—ఎంతమాట ! అంతో యింతో చేయునది వైద్యముకదా ?

రఘు—అట్లయిన, నీసారి యాసెర్చిలైటువీధిని వచ్చినప్పుడు- ఎన్ని కాండిల్సు పవరు (Candles power) కలదో చూచెదలెమ్ము.

శర్మ—అట్లయిన మీ కా పవరు రేపే చూపఁ గలను!

రఘు—అ దెట్లు ?

శర్మ—ఎట్లా ?— మరల నొకసారి రవంత మధుసేవ చేసి మనవి చేసెదను. కాసింత మీరుకూడ కానిండు.

ఇద్దఱు—(గ్లాసులు నింపి నోటఁ బోసికొనుచుండఁగా— తెర పడును.)

ఇది ద్వితీయాంకము.




# తృతీయాంకము.

ప్రవేశము :—కస్తూరి యిల్లు.

ప్రవేశము :—కుర్చీపైఁ గూర్చుండి శర్మ యెదుట నిలుచుండి కస్తూరి.

కస్తూ—పంతులుగారికి నామీఁద నేఁడు పరిపూర్ణ కటాక్షము వచ్చినది!

శర్మ— ఇదిగో ! మొదలే నేను పుట్టుడు మొగ మోటమితో వచ్చినాను! అట్టి పెద్దమాటలు విసిరి నన్నడలఁగొట్టకు!

కస్తూ—ఎంతమాట! తాయారుమీఁద మీకు తగనియిష్ట మని వాడుక. అందుచేత నట్లన్నాను

శర్మ—నిజమే కాని - నీచపుముండ నిలువుకొనలేక పోయినది! కులమువానిని మరగి కూటిలో మన్ను వేసికొన్నది!

కస్తూ—అట్లయిన, దానియింటికి మీరు దయచేయుటలే దన్నమాట ?

శర్మ—నీతోఁడు! నీతో నే నబద్ధ మాడుదునా? కులమువాఁడు పొరలి వెళ్ళిన ప్రక్క—మీఁద— కుక్క—నవేనువలెఁ గూలఁబడవలసి వచ్చినప్పుడా గుమ్మము త్రొక్కుటకంటెఁ గూడనిపని యున్నదా? ఒక్క తాయారే కాదు- ఇపు డెక్కడఁ జూచిన నిదే కర్మము! కులమువాఁడు ముందు- కిలమువాడు వెనుక!

సీ॥ సోమయాజులుగారి । శోభనాంగికి, దాని
మద్దిలకాఁడె కా । మాఱు మగఁడు !
ఆచారిగారి సిం । హాచలంబునకు గ
జ్జెల మోఁతగాఁడె కా । వలపు మగఁడు !
పంతులుగారు చే । పట్టిన యిందిరా
న్యకు పిడేల్ కాఁడె కా । చాటు మగఁడు !

నాయఁడుగారు ప్రా•ణముపెట్టునట్టి ర
తికి తి త్రికాఁడె కా•తేర మగఁడు!
పెద్దకోమటి సొమ్ముతోఁ • బెరిగినట్టి
మురహారికి తాళిగాఁడె కా•ముద్దు మగఁడు!
ఇది యది యనంగ నేల యే • యింటఁ గనిన
కులమువారలె విటులు సా•నులకు నేఁడు!

కస్తూ___ఆదోష మెవ్వరి దని మీ యభిప్రాయము?-

సీ॥ సుబ్బిసెట్టి తెనాలి • సుందరి యింటను
పక్కలు వైచి, దీ•పములు పెట్టు!
పొట్టిపంతులు, విరి•బోణి మేళములకు
వెడలిన యూరెల్ల • వెంబడించు!
కామశాస్త్రిలు పూల • కనికి కూఁతుండ్రకు
మగలఁ దెచ్చుటకు రే•వగలుఁ దిరుగు!
స్వామినాయఁడు తన • సాని నన్యుల కప్ప
గించి, తా వీధివా•కిటఁ బరుండు!
కొండమీఁద నున్న • కోఁతి కావలె నన్నఁ
జచ్చి యైనఁ దెచ్చి • యిచ్చువారె
పాడుపనుల కిట్లు • పాల్పడుచుండంగ
సానిముండ లేమి • సలుపకుండ్రు?

శర్మ___ఎట్లయిన నేమి- ఎక్కడనో నీవంటిది తప్ప- యేయింటఁ జూచి
నను, కులమువాని కుక్క కానిది లేదు!

కస్తూ___సరి సరి నామాటకేమిలెండు- నామీఁది దయచేత నన్నిట్లు
పొడిగించుచున్నారు!

శర్మ___నీతోఁడు! నీసంగతి నీయెదుటఁ జెప్పవలసినది కాదు. నిశ్చ
యముగా నీవంటివాండ్రు కోటికి నూటికిఁ గొందరైన నుండుట
చేతనే ప్రపంచము నిలిచినది, అందుచేతనే, ని న్నాకాశమున

కె త్తవలెనను తలంపుతో, మంచి స్కీ మొకటి మనసులో స్థిర పఱచుకొని వచ్చినాను. నీతోడు నీ యంగీకారమే తరువాయి.

కస్తూ—ఏదో విశేషము లేకున్న మీరు రేతెంచువారు కారని నేను మొదటనే యనుకొన్నాను. ఏమిటి యా స్కీము? (Scheme)

శర్మ—జమీందారు రఘునాధరావుగారికిని నాకును, జచ్చినఁ జావు బ్రతికిన బ్రతుకు అనునంత ఫ్రెండ్షిప్పు. (Friendship)

గీ॥ కుడుచునప్పుడు నేనును ♦ గుడువవలయు
ముడుచునప్పుడు నేనును ♦ ముడువవలయు;
కాయములు మావి రెండుగాఁ ♦ గానఁబడిన
మానసం బొక్కటియె కాని ♦ మాఱు లేదు.

కస్తూ—అంతవఱకు నే నాలకించినదే.

శర్మ—అట్లయిన నిఁక నంతగాఁ జెప్పవలసిన పని లేదు. ఆ (Influence) యిన్ఫ్లూయన్సంతయు నీ నిమిత్తము వినియోగించి- నిన్ను బంగారు పిచ్చుకను జేయుటకు నిశ్చయించుకొన్నాను.

కస్తూ—ఏ విధముగా ?

శర్మ—ఏ విధముగా నేమిటి?- ఆయనకును నీకును అతుకుపెట్టి.

కస్తూ—(తనలో) ఇతనిరాక నా కిప్పు డర్థ మైనది. కనుక నే నిప్పుడు కాసింత గడుసుతనముగా వెళ్ళవలెను.

శర్మ—ఏమిటి యాలోచించుచున్నావు ?

కస్తూ—అనుకొన్న దొకటియు, ఆలకించిన దింకొకటియు నైన దని.

శర్మ—నీ వే మనుకొన్నావు ?

కస్తూ—(మొగము చిట్లించి) సరే, నే నే మనుకొన్న నేమి! అందని మ్రాని పండున కఱ్ఱలు చాచుట యవివేకము కదా !

శర్మ—అనఁగా ?

కస్తూ—అనఁగాను లేదు, వినఁగాను లేదు కాని— ఆరాత్రి మీ రా యూరేగింపులోని కెందులకు వచ్చినారు ?

శర్మ—అందఱు నెందులకు వచ్చినారో- నేను నందులకే.

కస్తూ——అలాగునన్నా! ఆమాట తెలిసినచో - అందఱను జూచిన కన్ను లనేమిమ్ములను జూచియుండెడిదానను! (అని చరాలున మరలును,

శర్మ——వెళ్లకు వెళ్లకు - వెళ్ళిన నొట్టు! (అని చటాలున లేచి, చేయి పట్టుకొని) ఇప్పు డన్నమాట యేమిటి?- అందఱను చూచిన కన్నులనే నన్నును జూచియుందువా? అట్లయిన, స్పెషల్ (Special) కంటితోఁ జూచినా నన్నమాటయే! నిజముగా నామీఁద నీకట్టి యభిమానమే యున్నచో - నీ పాదములపైఁ బ్రాణములు విడువనా!

కస్తూ——అమ్మయ్యో! - ఆపనిమాత్రము వలదు! బ్రతికియున్నచోఁ బై చూపులతో నైన భ్రమ తీర్చుకొనెదను.

శర్మ——(సంతోషముతో) వహ్వా! వహ్వా! వన్సుమోర్! వన్సుమోర్! ఏమి టేమిటి? భ్రమా?- ఎవరిమీఁద?- నా మీఁదనే! ఆ బంగారునోట-ఆముద్దులమాట మఱియొకసారి యను!

కస్తూ——పిల్లికిఁ జెలగాటము, ఎలుకకు ప్రాణపోకడ యనునట్టు-నామాట మీ కంత నవ్వులాటగా నున్నది! అదిగో - మరల నవ్వుచున్నారు! పోనిందు నేనిఁకఁ జెప్పనే చెప్పను! (అని మరలును)

శర్మ——(మరల పట్టుకొని) నాతోడు! నన్ను చంపుకొని తిన్నట్టే ఏదేదీ?- ఆరాత్రి నన్నుఁ జూచినదిమొదలు?- చెప్పు మఱి!-

కస్తూ——చెప్పుట కేమున్న దేమిటి?-

ఉ. అన్నము తిన్న నొట్టు! నిదు ♦ రన్నది పోయిన నంతకన్న నో!
పెన్నఁడు నిట్టివింత విని ♦ యేని యెఱుంగను! సిగ్గు! సిగ్గు! నా
కన్నులి వింత దుండగవుఁ ♦ గన్నులొ- మీ వదనారవిందముం
గన్నక్షణంబునుండి మిముఁ ♦ గాంచుటకే పలవించు నిచ్చలున్!

శర్మ——హాయిహాయి! హాయి హాయి! అదృష్ట మనఁగా నాది! ఏదీ- ఆపాటున నొక్క-ముద్దు పెట్టు! (అని కౌఁగిలించుకొని ముద్దాడి) ఇదిగో- యిప్పుడు నాసంగతి చెప్పెద విను. నీకు నామీఁద నిన్ననో మొన్ననో కలిగినది కాని- నీమీఁద నాకు నిరుటినుండి పుట్టినది! అయిన నాస్థితిలో నీయింటఁ గాలు పెట్టుట కిష్టములేక-

మ. కనులారన్ నిన్నుఁగాంచియైనఁ దనియంగా వచ్చునం చెద్దియో
పని యున్నట్టులె, వెఱ్ఱికుక్క వరుసం బల్మాఱు మీయింటి వం
కను దారాడుచు- నీవు మేళముల కేఁగ న్వెంట నేతెంచుచుం
దినము ల్పుచ్చితి- నామొఱ ల్వినియె నాఁతీ! దైవ మీనాఁటికిన్!

కస్తూ—ఆఁడుదానికిని మగవారికిని గల యంతర మెంతయో చూచితిరా! నిరుటినుండి మీరు నివురుగప్పిన నిప్పువలె నుండఁ-నిన్నఁగాక మొన్నఁ బుట్టిన నావలపు నే నిట్టె బయటఁ బెట్టుకొన్నాను.

శర్మ—ఇదిగో- నవ్వకుండ, నా మొగమువంకఁ దిన్నఁగఁ జూచి చెప్పు- నీవు నిజముగా నన్ను వలచితివా?

కస్తూ—(చిరాకుతో) ఇదిగో యిదే పురుషులయొద్ద నున్నవుందు!

శర్మ—నీతోడు నీతోడు!- ఆమాట మఱియొకసారి విని యానందింపవలెనని కాని- నిజముగా నీయందు నమ్మకము లేక కాదు. నీమాట నమ్మనివాఁడు నీయింటఁ గుక్కయై పుట్టు ననుకో! నచ్చినదా? నచ్చినచో, నా వంక నొకసారి చూచి పక్కున నవ్వు! ఆఁ! చాలును! ఇక్కడి కొకరిమన సొకరికిఁ దెలిసినది కనుక, నిఁక ముందునంగతిని గూర్చి ముచ్చటింతము. నీకడ నిఁక దాఁపరికమేల- నా మెడికల్ ప్రాక్టీసువల్ల నాకు వచ్చునది నా సిగరెట్లకుఁ జాలదు. అట్లు గాక, నిన్ను నేనే భరింపఁ గలిగిన మొదల- చక్రవర్తికైన నీసాన్నిధ్యము దొరకనిచ్చువాఁడనుగాను. అందువల్ల, రఘునాథ రావుగారిని నీ కతుకు పెట్టి, ఆయనద్వారా నిన్నాకాశమున కెత్తుటకును- ఆయనచాటున నీతో నానందించుటకును నిశ్చయించుకొన్నాను. నీవుఁగూడ దీనికి 'ఎస్' (Yes) అంటివా-నీకు నా మీఁద నిజముగాఁ బ్రేమ యున్నట్లే లెక్క.

కస్తూ—ఎస్సో గిస్సో నా కేమియుఁ దెలియదు. మగవారి యాలోచన మగవారికే గాని- అభము శుభము నెఱుఁగని యాఁడుదాని కేమి తెలియును? అందును నేను వట్టి యమాయికురాలను. నా కంటికి నల్లని వన్నియు నీళ్ళు, తెల్లనివన్నియుఁ బాలు. నీట

ముంచినను బాల ముంచినను మీదే భారము. ఆవగింజంతకూడ మీ మాట కెన్నఁడు నడ్డు చెప్పుదానను మాత్రము కాను.

శర్మ—అదిగో- అదీ మాట! ఆమాటమీఁద నీవు నిలువఁబడితివా- యెల్లుండికి నీయొంటెని ఏడువారముల నగలు తగిలించి, ఆవ లెల్లుండికి అయి దంతస్తుల మేడమీఁదఁ గూర్చుండఁబెట్టు భారము నాది. ఈరాత్రి రఘునాథరావుగారి నిచటి కీడ్చుకొని వచ్చెద. ఒక రహస్యము- ఆయనకుఁ గొంచెము చుక్క యలవా టున్నది; సరే నాసంగతి నీవు వినియే యుందువు. అన్నట్టు, నీ కేమయిన రవంత యలవా టున్నదా?

కస్తూ—(తనలో) రవంతకర్మ మేమి- పూఁటకు బుడ్డి చాలదు! (పయికి) నా కంతగ నలవాటు లేదు కాని-మీవంటివారు తటస్థ మగునప్పుడు మితముగాఁ బుచ్చుకొను వాడుక కలదు.

శర్మ—సరి యిఁక నేమి- చాలును. ఇం కొకటి. ఇంతవఱ కాయన బ్రాంది విస్కీలే కాని- పయిరుచు లెఱుఁగఁడు. పడఁదీసి నీ విప్పుడు పయిగ్రంథములోనికి దింపవలెను. అప్పుడుకాని మన కాయన యుంకెకు రాఁడు. తెలిసినదా?- సోడా విస్కీలు నేను బంపెదను. తక్కిన పదార్థములు నీవు తయారుచేసి సిద్ధముగా నుండుము. నేను పోయి రానా?

కస్తూ—అమ్మయ్యో! అప్పుడే వెళ్ళెదరా! శీఘ్రముగా వచ్చెద నని నా చేతిలోఁ జేయి వేసినఁ గాని- నేను వెళ్ళనీయను!

శర్మ—ఓసి వెఱ్ఱిముండా! నిన్ను విడిచి నేనుమాత్రము నిమిష ముండఁ గలనా! అమ్మతోడు- తొమ్మిది కొట్టుసరికి ఆయనయు నేను నిక్కడ నుందుము. ఒక్కటే మాట- ఆయాస మాయనది- అనుభవము మనది. ఈమాట మనసులో నిడికొని, యెట్లు మసలవలెనో యట్లు మసలుము. ఒక్క ముద్దేదీ- (అని ముద్దు పెట్టుకొని, నిష్క్రమించును).

కస్తూ—(కుర్చీపైఁ గూర్చుండి) మొత్తముమీఁద నీతనికి నాపై మోజుగానే యున్నది. రఘునాథరావుగా రీతనిచేతి రాట్నపుఁ

దిరుగుడుగా నున్నట్లిదివరకు వినియె యున్నాను. ఏమో కస్తూరిరేఖ బయటఁబడు కాలము వచ్చిన దేమో! ఎందులకుం గొంటు గాని ముండలకుఁ గూడ నెంతలేసి భాగ్యములు పట్ట లేదు!

సీ॥ కూటికిం గుడ్డకుఁ ♦ గూడఁ దిప్పలు వడ్డ
మీనాక్షి యద్దాల ♦ మేడ కట్టె!
విటులకోసము వీధి ♦ వీధియుఁ దిరిగిన
మాణి దివాణంపు ♦ రాణి యయ్యె!
కడకు బేడకుఁ గూడఁ ♦ గక్కుర్తి పడినట్టి
కనికికి మోటారు ♦ కారు లోదవె!
పగలు గన్గానినఁ దంప్పక రాత్రి కల నగ
పడు రంగి జడ్జీకి ♦ ప్రాణ మయ్యె!
వర్తకుఁడు, వైద్యుఁడు, వకీలు ♦ వారకాంత-
యనెడు నీ వకార చతుష్టయము దె లక్ష్మి;
ఆదినో, మధ్యనో, లేక ♦ యంతమునసొ
వెలిగి తీఱుదు రిల నొక ♦ వెలుఁగు వీరు!

మఱియొక విశేషము-

గీ॥ వర్తకున కూర మేడయు ♦ వైద్యున కొక
పతకమును; న్యాయవాదికి ♦ బండి; వేశ్య
కున్నత ప్రాపకం బివి ♦ యొదవెనేని
పరపతియు, గౌరవము, వచ్చు ♦ బడియు హెచ్చు.

కాని, నేను నూవుగింజ వ్యవసాయములోఁ బడి కర్తవ్యము మఱచినాను, సోడా విస్కీలతఁడు పంపును- పట్టెడు కోడిపిల్లతో పయినంజులును సిద్ధము కాఁగలవు. నా ముస్తాబున కేమిటి దారి? అందును, దొంగకుఁ జీఁకటివలె- వేశ్యకు వేషమే యంగరక్షకము. నా తల్లిముండ నగలె కాక- సన్నచీరలుకూడ సారాయి కొట్లకు సమర్పించువఱకుఁ జచ్చినదే కాదు! నా తల్లిని, నన్నును గూడ మించినవాఁడు నా తమ్ముఁడు! అయినను, వారి ననవలసిన పని లేదు-

చ॥ తలఁపఁగ వారకాంతలకు । త్రాగుడు; పాపులకున్ సుషుప్తిఁలో
భుల కమిత వ్యయేచ్ఛ గల । పుత్రులు; చోరులకుం బిణంబు; కా
పుల చెడలేని క్రోధతగ । పుల్; పనివాండ్రకు బద్ధకంబు; బా
పల కసమష్టి దోషమును । బార్విలకుండినఁ బట్టు శక్యమే !

వెంక టేశము—(సత్వరముగాఁ బ్రవేశించి) అక్కయ్యా! అక్కయ్యా!
అగ్గిపోరులాంటి బేరం తగిలింది । అక్కేవి టల్లా వున్నావు ?

కస్తూ—నా యుండుట కేమి కాని- ఏమి టాబేరము ?

వెంక—కాసింసాహేబు నీమీద కన్నేశాఁడు.

కస్తూ—ఏ కాసింసాహేబు? సిరంవారి మేడలోని సిల్కుబట్టల వర్తకుఁడా?

వెంక—అతఁడే అతఁడే! నిన్న గుమ్మంలో నుంచుండగా నిన్ను చూచాట్ట- అప్పణ్ణుంచీ, అట్టుడికిన ట్టుడికిపోతున్నాఁడు. వట్టి వాజముండాకొడుకు! నేల చూపి నెత్తి గొట్టొచ్చును. ఇదుగో- యీచోక్కా అత డిచ్చిందే. చెపితే నమ్మవు- చేతి కెముక లేదు! రవంత నువ్వు రంగు చేశావంటే రమ్మంటే పీల్చినట్టు పీల్చె య్యొచ్చును. వీధిలో నుంచోబెట్టి వచ్చాను- ఏఁ వంటావు ?

కస్తూ—అట్టయిన, నొక సంగతి చెప్పెద నాలకింపుము : ఈ రాత్రి జమీందారు రఘునాథరావుగారు మనయింటికి రాఁగలరు-

వెంక (ఆత్రముతో) ఏఁవిటే!- జమీందారుగారే! అబ్బో! అబ్బో! అయితే యిం కేఁవీ !- అదురుష్టదేవత మా అక్కయ్య చుట్టకు అగ్గిని ప్పందించిం దన్నమాటే! కల్లుకొట్లకు నేను ఇకమీద వెళ్లా నన్నమాటే! వో! వో! వొళ్ళు గరిపొడుస్తోంది! అయితే, అక్కయ్యా! యీకబు రెల్లా వొచ్చింది?

కస్తూ—ఆసంగతి యావల చెప్పెదను. ముందీసంగతి విను : వనివచ్చు సరి కింట నొక పట్టుచీరయైన లేకపోయినది. సాహేబుకడ నొక సిల్కుజీర సంగ్రహింపఁ గలమా ?

వెంక—అబ్బే-అదెంత పని! కాస్త నువ్వు కొంగు తాకించావంటే కావల్చినన్ని చీర్లు. ఇదుగో-యీడ్చుకొస్తానుండు. (అని వెళ్లును)

కస్తూ—తురకసరసమునకు రవంత చుఱుకుదన మవసరము- చుఱుకు దనమునకు రవంత చుక్క యవసరము. (అని యలమారులోన బ్రాందిసీసా తీసి కొంచము త్రాగును.)

వెంక—(కాసింసాహేబుతోఁ బ్రవేశించును.)

కస్తూ—(మందహాసముతో) సలామండి- సాహేబుగారు!- సలాం!

కాసిం—(కంగారుతో) సానివారూ మాకీ సలాం సెప్తే- సానివార్కి మేం- సలాం మీఁదా సలాము సెప్తాం! (అని సలాం చేయును.)

వెంక—అక్కయ్యా! సాహేబు బావయ్యగారికి నీమీద చాలా సరదా పుట్టింది. నిన్నట్నుంచి నీకోసం- నిప్పుతొక్కిన కోతిలా గున్నారు. వొళ్ళు ముడ్డెడితివా- వొందరూపాయి లిస్తారు. ఏం బావయ్యగారూ?

కాసిం—ఠీక్ ఠీక్! మనసులోదీ మాటా— బయిటికీ- బరాబర్ తీసి- మీా ముంగలా యేశాడ్. ఘుమ్మంలో మిమ్మల్ని సూశాం- ఘుప్పునా మొఖాన్ని ఖున్నా యేశాం- ఘుండెల్లో, ఘుబుల్ ఘుబుల్ బయిదెల్లింది! సాపుకీ యెల్లాం- సందుగా కాడా కూకు న్నాం- ఘుండెల్లో, ఘుబుల్! ఘుబుల్! ఘుబుల్! నమాజ్ సేస్కున్నాం- నాస్తాకాడా కూకున్నాం- ఘుండెల్లో, ఘుబుల్ ఘుబుల్! ఘుబుల్! బీడీ గీడీ కాల్సుకున్నాం- బిశానామీాదా తొంగున్నాం- ఘుండెల్లో, ఘుబుల్! ఘుబుల్! ఘుబుల్! కంటి కీరెప్పా తగిల్తే- గడ్డి మాదీ వొఖటె!

కస్తూ—మీా గుబులు నేను తీర్చెదఁ గాని- యిటువచ్చి యీా కుర్చీపైఁ గూర్చుండుఁడు.

కాసిం—మాకీ కూకో మంటే కూకుంటాం- మల్లి- గులామల్లి కమ్మంటే- గులామల్లీ అవుతాం.

వెంక—బలే! బలే! మా బావయ్యగారిమాటే పయ్యాడింది!

కాసిం—(సంతోషముతో) అరే! అరే! మాదీ మాట—మీాదా ఆడిందిదీ వోయ్! మంచీమాట సెప్పిం దాన్కి మల్లి- యీానా

విస్తా వుచో్కా! (అని జేబులోని రూపాయలు తీసి) ఏక్, దో, తీన్, చార్, పాంచ్,! (అని చేతిలో వేయును).

వెంక—(తనలో) నాది నాకు ముట్టింది! ఇప్పుడు నా ప నేమీ లేదు. ఇంతలో వోసారి కొట్టుకాడికిపోయి చక్కావస్తాను. (నిష్క్రమించు

కస్తూ—ఇటువచ్చి కూర్చుండరేమి? (అని చేయిపట్టి లాగును).

కాసిం—(పారవశ్యముతో) వాహ్వ! వాహ్వ! క్యామజరే బావా! క్యామజా!

కస్తూ—అయ్యో దేవుడా? అదేమట్లు కన్నులు తేలవేయుచున్నాడు! కొంపతీసి గోవిందా కొట్టడు గదా! (చేయి విడుచును)

కాసిం—అరే! అరే! నచ్చిపోయాం! నచ్చిపోయాం! సానీవారూ! మీాకీ సలాం నేస్తాం- సెయ్యికీ సెయ్యా తగిలిపిచ్చి- సెనంవ్వూరు కోండి! మీాదీ శై తగిలేతల్కీ- మాదీ పానం మక్కాయెల్లింది!

కస్తూ—అలాగుననా! అట్లయిన, నీసారి రెండుచేతులు తగిలించెద లెండు, (అని రెండుబుజములమీాదను రెండుచేతులు వేయును)

కాసిం—(పారవశ్యముతో) అచ్ఛా! అచ్ఛా! అల్లా మీా నేతుల్లో అవల్ ఖుషీ- బలె షౌఖ్యం పెట్టాడండీ! అందుకూశాతే- బలే బలే వో ళ్లంతా- మీా పాదల్ మీాదా పానం యేస్తార్!

కస్తూ—మా చేతులకు మీా అల్లా మఱియొక గుణముకూడ పెట్టి నాడు. మీా జేబులలో బ్రవేశించుపఱకును మిలమిల లాడక మానవు! (అని జేబులు తడవి, యుండలినోట్లు తీసి) అఁ అఁ, నోట్లు, నా కొఱకే తెచ్చియుంటారు. నబాబు దర్జా యనగా- ఇది!

కాసిం—అదీ మాట! అఫ్కా దయా మాకీ మల్లంగా వుంటే- కుక్కల్ సేతా నోట్లూ- కుప్పల్ కుప్పల్ కక్కాస్తాం!

కస్తూ—అంతవారే మీారు. అన్నట్టు- కూర్చుండరేమి? (అనిలాగును.)

కాసిం—వోస్తాం! వోస్తాం!- జర్రా నిలండీ! (అని కాళ్ళ చెడావులు తీసి చేతఁ బట్టుకొని) బస్- చెలో!

కస్తూ—(నవ్వు బిగఁబట్టుకొని) చేతిలో చెడావు లెందులకు?

కాసిం—క్యా - చెడావ్ చోడ్దేనా? అచ్ఛా! (జోడు క్రింద వైచి! కూర్చుండి) మల్లీ- మీారూ్కాకోండీ- మాపానం వోరుస్తాదంచి?

కస్తూ—అట్లయిన నిదిగో, గూర్చుండెద. (అనియొడిలో గూర్చుండును)

కాసిం—(పారవశ్యముతో) అచ్ఛా! బోహుత అచ్ఛా! అవ్వ ఖుషీ యిప్డా అందుకుండీ- అమారా మన్సుం- పలావ్ దేక్నాతో పకానా ఖూసీ- మామ్డీవంట్లో మకాం సేసీ- హాల్వా మేసీ- హంజూరా కోర్కు బీడీ కాల్సి- గుడాక్ పీల్సి- గు మ్మయ్యా పోయ్యంది!

కస్తూ—సరి కాని- సాహేబుగారు! మీకీ గడ్డ మెందులకు?

కాసిం—బోల్నా? కాపోడ్కు కాడీ- కమ్యాడ్కు పాడీ; గుమ్మానికి సీడీ- ఖులాసాకీ భీడీ; పమసోళ్ళకీ జోడీ- పలావుకీ కోడి; రవుత్కు ఘోడీ- రండేకీ కాడీ; ముల్లుకీ జీడీ-ముసల్మానికి దాడీ-ముఖ్యం! ముఖ్యం! మీ అందానికి తోడూ- మీమూతికి దాడీవుంటే- సబ్జఫరీ మీ పాదాల్కాడా వచ్చిందీ మాట!

కస్తూ—అయితే! హిందువులకు మీ రన్నిట వ్యతిరేక మంట కా?

కాసిం—అదీ మాటా! హింధూవాడూ మీందా పెంచీ! కిందా గోర్గితే- మాదీ కింధా పెంచీ! మీందా గొర్గుతాయ్. హిందూ వాడూ హెడం నుంచీ ఖుడ్కురాస్తే-మాదీ ఖుణ్ణుంచీ హెడానికి రాస్తాయ్. హిందూవాడూ హేదం నమ్మితే- మాదీ ఖురా న్నమ్ముతాయ్. హిధూవాడూ శపం సేస్తే- మాదీ నమాజ్ సేస్తాయి. హింధూవాడూ కాసీ యెత్తే-మాదీ మక్కాయెల్తాయ్.

కస్తూ—హిందువుల్లు కాళ్ళతో నడువ- మీరు తలతో నడువ రేమి?

కాసిం—మాకీ తలా నేలకీ తగిలిపిస్తే- మాసీ పోదండీ?

కస్తూ—మాసిపోయినచో, మడేలువానిచే నుతికించుకొన వచ్చునుగా?

కాసిం—వుత్కితే ధాడీ వూడీ పోదండీ?

కస్తూ—(ఫక ఫక నవ్వి) అదా వచ్చిన చిక్కు! (తనలో) అవురా! అమాయికత్వము! కనుకనే, యింత సామ్రాజ్యమును గంగలో కలిపి- కుట్టుపనికిని, గుమ్మము కావలికిని సిద్ధమయినారు, (పయికి) సాహేబుగారు! మీ పూర్వు లెంతటివారో యెఱుంగుదురా?

కాసిం—జత్తా సెప్పండీ యింటాం!

కస్తూ—చెప్పు మనెదరా? (అని లేచి)

సీ॥ భరతఖండం బెల్ల ♦ పాలించి సిరులతోఁ
దూఁగినవారు మీ ♦ తురకవారు

కాసిం—అదీ మాటా, యింఁదండీయానాం! (అని యుంగరమిచ్చును)

కస్తూ—వీరులై పోరుల ♦ వీరాధి వీరుల
దునుమించినవారు మీ ♦ తురకవారు

కాసిం—అచ్ఛా! అచ్ఛా! మా సేత్కి కత్తి యిస్తే మజా సూస్తాం,

కస్తూ—నవరత్న సింహాసనంబులఁ గూర్చుండి
తొడరినవారు మీ ♦ తురకవారు

కాసిం—(దిగ్గునలేచి) ఛూ, కుర్చీమీందా కూకుండీ-కూకా-అయ్యాం,

కస్తూ—భోగంబునందును ♦ త్యాగంబునందును
తులలేనివారు మీ ♦ తురకవారు

కాసిం—బరాబర్! వండగా దిగ్తే- పలావ్ మీందాపడి సచ్చిపోతాం!

కస్తూ — శూరవరులకు జాగీరు ♦ లూరి కొలువు
కాండ్రికెల్ల మిరాసీలు ♦ కవుల కగ్రి
హారములు, పండితులకు మాన్యంబు లొసఁగి
తుటఁగలించినవారు మీ ♦ తురకవారు!

కాసిం—అదీ మాటా! అంతా సెప్పించావ్కి. సానీ వార్కి మేం
సంతోషం సేస్తాం- కోరండీ- ఆఫ్కా ఖుషీ- కోరండీ!

కస్తూ—మాట తప్పరుగద?

కాసిం—మాటా తప్తే- తురకా బిడ్డా మానీ- దూదేక్ బిడ్డా బోలో!

కస్తూ—అయితే, యీరాత్రి సిల్కుచీర కట్టుకొని హాయిగా మీతో
నుండవలె నని యున్నది- పంపెదరా?

కాసిం—యిస్కా మాకీ తుఖ్- యిదా సెప్పిందీ- కాకిమీందా యేసి,
కట్టా సీరల్ పంప్తాం- తమర్కి నచ్చిఅయిందీ రీతాఫ్ సేస్కోండీ.

కస్తూ—కాకిమీఁదను వలదు- గాడిదమీఁదను వలదు. అదుగో మా
తమ్ముఁడు వచ్చుచున్నాఁడు అతనిచేతఁ బంపుఁడు.

కాసిం—అదీ మాటా ! హోదాగంటా ! హావ్వే తల్కీ, హాక్డా సీరల్ హిక్డా హుండ క్వోతే- మాదీ బాత్- మంజూర్ సెప్పకండీ,

వెంక—ఏఁవి టక్కయ్యా ! యేఁవిటి ?

కస్తూ—మీా తురకబావగారు సిలుకుచీర లిచ్చెదరఁట- వెంట వెళ్ళుము,

వెంక—వో! రండీ బావయ్యగారూ- రండి ! (అని పట్టి లాఁగును.)

కాసిం—అరే ! హుండూ వోఁయ్ హుండూ ! హుకుం తీస్కోనీ ! సలామండీ సానీవారూ- సలాం, మన్షూ మీాకీ తగిల్పిచ్చీ-మీాదీ పెరీళం సావుకీ యెల్తాయ్. సీరా కట్టీ మీార్ సిద్ధంగా హుంటే- మల్లీ వొచ్చీ మేం మజాఖా సూస్తాం ! చెలో- సాలా!- ఛరో, (అని వెంకటేశముతో నిష్క్రమించును.)

కస్తూ—ఇక్కడికి, చీరబాఁగ దీఱినది !

సీ॥ ఆఱిపోయిన చుట్ట ♦ కగ్గి చేకుఱినట్లు
ఆఁకటితఱి నన్న ♦ మమరినట్లు
లేవడిలో లాటరీ వచ్చి పడినట్లు
పొరుగూరిలో నప్పు ♦ పుట్టినట్లు
నట్టేటఁ జేతికి ♦ నావ చిక్కినయట్లు
కఱవులో వర్షము ♦ కురిసినట్లు
బగ్గువేసఁగి నింట ♦ బత్తె యీనినయట్లు
పై బేస్తులో నాట ♦ పడినయట్లు
సమయమున కేగుదెంచి యీ ♦ సాహెబయ్య
పయికమూ యిచ్చి, చీరలుం ♦ బంపుచుండె;
మంచిదినములు కడుసమీా ♦ పించె ననుట
కింతకన్న నిదర్శన ♦ మేమి వలయు ! (తెర పడును.)

ఇ ది తృ తీ యా ం క ము.



